Registered No. M-4484.

5 Cps
Ed. 8th file

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ అక్టోబరు నెల 16 వ తేది శుక్రవారం [నె 41 రు.



"ఎగిరే కోట."

అమెరికాలో తయారయిన 4 ఇంజనుల బాంబరు విమానం ఇటువంటివి యిపుడు ఇండియా విమానాశ్రయాలనుండి పోయి బర్మాపై దాడిచేయుచున్నవి. రాయలు విమానదళమునందు యిపుడు వీటి సంఖ్య అధికమయింది.

## హిట్లరు కష్టాలు ఎక్కువగుచున్నాయి.

### చర్చిల్ ప్రధాని యుద్ధ సమీక్ష.

మిత్రమండలి శక్తియందు విశ్వాసము.

బ్రిటిషు ప్రధానమంత్రియగు చర్చిల్ ప్రధాని గారికి ఎడింబరోనగరంలో ఆనగర స్వాతంత్ర్య గౌరవమొసంగబడెను. ఆసమయమున వారు ఉపన్యశించుచు యుద్ధంగూర్చి యిట్లుతెలిపిరి :

"నేనిపుడు నౌకాదళంచూసివస్తున్నాను. ఆ నౌకాదళంలో కొన్ని నౌకలు మధ్యధరాసముద్రం నుండివచ్చినవి : తక్కినవి రష్యాకుపోయిన సరకులకు కాపలాగాపోయి గండాలు తప్పించుకొని వచ్చినవి. ఈ నౌకాదళమునకును, కొన్నివారాల క్రిందట నేను ఆఫ్రికా ఎడారిలో చూచిన సైన్యానికీ ఎంతో వ్యత్యాసంగలదు. వారి రంగులు, పరిసరాలు, దుస్తులు అన్ని వేరే. కాని ఉభయులకు ఒకటే సామ్యంగలదు. రోమెలునకు నైలు లోయకు మధ్య పెట్టనిగోడవలె నిలువగలమను ధైర్యం ఎడారి సైన్యానికి ఉన్నట్లే, యూరోపులోని రాక్షసుడు ప్రపంచాధిపత్యంవహించకుండ అడ్డుకోగలమనే ధైర్యం ఎడారిసైన్యానికి గలదు.

"మనదేశం (ఇంగ్లాండు) యిదివరకుకన్న చాల ఐకమత్యంతో మెలగుచున్నది. ఫ్రాంసులో 51 వ డివిజనుపోతే, ఓర్చుకొని దానిస్థానే మరో 51 వ డివిజను తయారుచేయబడింది. అది మొదటిదానివలెనే చాల ప్రశంసార్హముగ పోరుచు పగసాధించుచున్నది. విమానదాడులు ధైర్యంతో ఓర్చుకొనిరి. నేల నౌకా విమాన సర్వీసు లన్నింటియందును యీయుద్ధంలో స్కాట్లండువారు కీర్తివంతముగ పాల్గొనిరి.

శత్రువుల భీతి అరుపులు.

"మన శత్రువులు యిటీవల ఎక్కువ మాట్లాడుచున్నారు. రిబెను ట్రాప్, గోరింగు, హిట్లరులు మాట్లాడిరి. వీరిమాటలు వారిమనసులోగల భీతిని చాటుచున్నవి. వారి మామూలు ప్రగల్భాలు, బెదిరింపులు అటుండగ—వారిమాటలలో భీతి అరుపులు మందంగ వినబడుచున్నవి.

"తమనేరము, న్యాయవిధి ఎరిగినవారి మాటలవి. 1940 వ సం॥తో ఫ్రాంసు పడిపోయి, తూర్పు యూరోపంతా వశమయి, ముసోలోని మోసంచేసి వెనుకపోటుపొడిచినపుడు, ఇంగ్లాండొక్కటే మానవకోటి స్వాతంత్ర్యం కాపాడుటకు నిలచియున్నపుడు వారిమాటలకు యిప్పటి

మాటలకు ఎంతో వ్యత్యాసంగలదు. ఈ రెండేం డ్లలో వారిగొంతు మారుటకును, బలహీనులను క్రూరంగ అణచివేయుటయు, దురాక్రమణము మంచివికావని యీ దుష్టప్రవర్తకులు భావించు టకును ఏదో విశేషముండాలి.

"తన విజయాలనుగూర్చి ఎవ్వరూ ఎక్కువగ చెప్పుకోలేదని హిట్లరు ఏడుపు. "నేనెన్నిదేశాలు గెలిచేనో చూడండి, యితరులదేశాలు ఎన్ని తీసు కొని, ఎంతసామాను దోచుకొని ఎందరినిచంపేనో చూడండి. మిత్రమండలివారు చేయగల్గింది దీనితో పోల్చిచూడండి. వారింత కష్టనష్టాలు పడుతున్నా యింకా ఎలాగు తలఎత్తుకో తిరుగు తున్నారు" అని హిట్లరంటాడు. సరిగా యీమాటలేకాకున్న అతని భావం యిదే. అదే ఆతన్ని బాధిస్తున్న సమస్య. ఇన్నిదేశాలు గెలి చినా అతని అదృష్టం తగ్గుచునేయున్నది. గత రెండేండ్లలో అతడుగెలిచే అవకాశాలు చాలవరకు తగ్గిపోయినవి ; బ్రిటను అమెరికా చీనాల బలం అంతకంతకు అభివృద్ధిచెందుచున్నది. (హర్షం) మన ఓటములు విజయానికి మెట్లుగాను, అతని విజయాలు వినాశానికి మెట్లుగను అతనికి స్పష్టం గా కనబడుతున్నాయి కనుక ఆశ్చర్యపోతు న్నాడు. ఈ దుష్టుడు తన అంతం నెమ్మదిగ చేరువగుచున్నదని గుర్తించి, అదృష్టదేవత తనకు త్వరలో జయం చేకూరునట్లుచూపి హేళన చేస్తున్నందుకు తిడుతున్నట్లు నాకు తోచు చున్నది.

"బ్రిటను అమెరికాదేశాల ప్రజలు శాంతి ప్రియులు, అనుమానంలేని అమాయకులు శాంతి సమయంలో తమదేశ రక్షణగూర్చి తగు ఏర్పా టులు చేసుకోకుండా కూర్చున్నపుడు, అదివరకు ఓటమి ఎరుగక సైనికనేర్పులన్ని తెలిసియు యుద్ధం మంచిదికాదు తిరిగి జరుగదని ప్రమత్తు లై యున్నపుడు, ఏండ్లతరబడి రహస్యంగా తయారగుచు యుద్ధమే పరమధర్మంగా నెంచి, శాస్త్రపరిశోధనలలో మారణతంత్రం ఎంత అభి వృద్ధిచెందగలదో అంతాతెలిసి, పూర్తిగ శిక్షణ పొందిన జాతులవారు వారిపైబడితే, తయారు కానటువంటి శాంతిప్రియులు నష్టపోయి దుష్టు లధిగమించుటలో ఆశ్చర్యమేముంది. అంతతో అంతు తేలిందా ? అది ప్రథమాంకంమాత్రమే. శాంతియుతమగు మహా ప్రజాప్రభుత్వ రాజ్యాలు కొద్దియేండ్లు దౌర్జన్యపరుల ధాటి నోర్చుకొన్నచో, యింకో అంకం ప్రారంభమగును. అది త్వరలో ప్రారంభంకానున్నది. ఒకఏడాది ఒంటరిగ నిలచి, ధర్మంకొరకు పోరాడే దేశాలు తయారయేవరకు శత్రువులధాటి నరికట్టిన కీర్తి యీదీవులకూ యీ సామ్రాజ్యమునకే చెందినది."

ఖైదీలకు సంకెళ్లు.

తరువాత హిట్లరు తనవశమందున్న యుద్ధ ఖయిదీలకు సంకెళ్లువేసి గొలుసుకట్టుటనుగూర్చి దెల్పుచు చర్చిలుగారు యూరోపులో నార్వే ఉత్తర కొననుండి దక్షిణమున స్పెయిను సరిహద్దున నున్న బోయసీవరకు గల 2,000 మైళ్ల నిడివి గల ప్రాంతాలను బలవంతంగా దౌర్జన్య చర్యలతో అణచియుంచిన హిట్లరు, ఆప్రజలు తిరుగబడు చుండుటను సహించలేక అప్పుడప్పుడు సము ద్రంలోనుండి వచ్చిపడి జర్మను కావలా సైనికు లను హతమార్చుచున్న బ్రిటిషు కమెండో దాడు లకు కినిసి, ఏమీ చేయలేక తనవశమందున్న ఖైదీలను హిట్లరు హింసించుచున్నాడనెను. హిట్లరు ఆక్రమించిన రష్యాలోగూడ ఆతడు సివిలు ప్రజలను స్త్రీలనుబిడ్డలనుగూడ నిర్దాక్షిణ్య ముగ చంపుచున్నాడనెను.

స్టాలినుగ్రాడు నిరోధం

రష్యాపై రెండోసారి తాను ప్రారంభించిన దాడియందు యింతవరకు గెలు పగపడనందున ఆ విషయం అందరు గమనించకుండా ఇంకో విషయం ప్రపంచం మొత్తంపై చర్చనీయాంశ ములలోచేర్చి మభ్యపరచుటకై హిట్లరు బ్రిటిషు యుద్ధ ఖైదీలను హింసించుచున్నాడు. స్టాలిను గ్రాడు చాల ధైర్యంతో దాడిని నిరోధించు చున్నది. రష్యను సేన లేప్రాంతములోను చెదరిపోలేదు ఓడిపోలేదు సరిగదా, లెనినుగ్రాడు నుండి కాకససువరకుగల విశాల యుద్ధరంగము నందు ఎదురుతిరిగికొడుతున్నవి కూడను. జర్మను సేనలు చాల నష్టపోయినవి ; ఇంకో చలికాలం జర్మనులను త్వరలో ఎదుర్కొనును. ఈ ప్రమాదాలన్ని దాచ వీలులేనివి. అవి గాంచిన జర్మను ప్రజలు, అపుడే బ్రిటిషుబాంబులను రుచి చూస్తున్నవారు, యీ చికాకంతా తెచ్చిపెట్టిన తమ నాయకునివైపు తెల్లమొగం పెట్టుకోచూస్తున్నారు. నోరెత్తి నిందించేధైరం వారికిలేదు. రష్యా పై కెందుకు పోవాలీ అని వాపడుగుచున్నారు. యీ పూచీ అంతా హిట్లరుదేననియు రష్యాపై యుద్ధం హిట్లరే నిర్ణయించెను. యుద్ధం

(తరువాయి 4 వ పేజీలో)

# విమర్శ.

●

## పార్లమెంటులో ఇండియా చర్చ

## గాంధి-అక్షరాజ్యాల రేడియో.

●

ఇండియా బర్మాల చట్టం మూడో ప్రతిపాదన బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో మంగళవారంనాడు ఆమోదించబడినది.

ఇండియా చర్చ, శాసనోల్లంఘనం నియంతృత్వం

ఇపుడా చట్టం ప్రభువులసభకు పోతుంది. చట్టం రెండోసారి ప్రతిపాదించబడినపుడు సభలో ఇండియానుగూర్చి విపులంగా చర్చించబడెను. ఇండియా మంత్రి అమెరీగారు, ప్రతికూల పక్ష నాయకుడు ఆర్థరు గ్రీనువుడుగారు, డిప్యూటీ ప్రధాని అట్లీగారును ఉపన్యశించిరి. వారి ఉపన్యాసాలలోనివాదం యిదివరకు తెలిసిందే. అయినా కొన్ని అంశాలు కొన్ని భావాలు ఇపుడునొక్కి వక్కాణించుట అవసరం. మొదటి దేమన, సభలో అన్ని పక్షలవారును శాసనోల్లంఘ నోద్యమమును నిరశించిరి. ఒకటిమాత్రం స్పష్టమయింది. యుద్ధంలో మంచి రసగంధాయసమయంలో కుట్రలు తిరుగుబాటుతోకూడిన ఉద్యమం ప్రారంభించిన వారితో, ఆ ఉద్యమం విరమించి వానివలన కలిగిన దౌర్జన్య కృత్యాలను ఖండించేవరకు, దాన్ని ప్రారంభించిన వారితో బ్రిటిషు పార్లమెంటుగాని వారి నెన్నుకొన్న బ్రిటిషు ప్రజలుగాని రాజీకిరారు. చర్చలో తేలిన యింకో స్పష్టమగు అభిప్రాయం ఏమంటే, ఇండియాలో ఏ ఒక్క పార్టీని యితర పార్టీలకు నష్టదాయకంగా ప్రభుత్వాధికారం వహించుటకు అవకాశం యివ్వరాదని సభవారు నిశ్చయించిరి. ఇండియా సంతృప్తిచెందిన స్వాతంత్ర్య దేశంగా ఉండాలంటే పార్టీప్రభుత్వం ఉండరాదు. ఇవి జరుగరాని పనులగూర్చిన భావాలు.

> **వచ్చేవారం ప్రత్యేక సంచిక.**
>
> యుద్ధసంచిక వచ్చేవారం సుమారు 40 పేజీలతో, సైన్యానికి సంబంధించిన పెక్కు వ్యాసములు 21 పటములతోగూడ, ప్రత్యేక సంచిక వెలువడును.

జరుగగల సూచనలగూర్చి : ఇండియాకు స్వయం నిర్ణయాధికారం యివ్వవచ్చని ఇండియా యిష్టపడినచో స్వపరిపాలనమే నిశ్చయించుకోవచ్చని అందరంగీకరించిరి. అమెరీగారు తమ ఉపన్యాసంలో యీ విషయం స్పష్టంగా యిట్లు దెలిపిరి :—

స్వయం నిర్ణయ సూత్రం

> "తమ దేశ వ్యవహారాలు నిర్వహించుకొనే అధికారం ఇండియాకు యిచ్చేటట్లును, యిష్టముంటే బ్రిటిషు కామనువెల్తులోనుండే నిర్వహించుకోవచ్చును యిష్టంలేకుంటే విడబడియే నిర్వహించుకోవచ్చుననియు సూచింపబడెను"

అమెరిగారి మాటయందు నమ్మకం వెలిబుచ్చుచు స్వతంత్ర కార్మికపక్ష నాయకుడగు మెక్ట్సనుగారు యిట్లు నుడివిరి :—

> "భారతీయులకు సంపూర్ణ స్వాతంత్ర్యం వాగ్దానం చేయబడినది. వారు కోరినట్లైయితే అధినివేశ 'రాజ్యాంతో సఖ్యత త్రెంచుకోడానికిగూడ స్వాతంత్ర్యం వాగ్దానం చేయబడింది"

వీలయినంత త్వరలో అందరికి గౌరవ ప్రదంగానుండేటట్లు రాజీ కుదురాలని అన్ని పార్టీలవారు ఆదుర్దపడినట్లు యీ చర్చలో స్పష్టమగుచున్నది. భారతీయ నాయకులతో సంప్రదింపులు కొనసాగించి వైస్రాయిగారు తమకుగూడ యీ ఆశగలదని స్పష్టపరచిరి. కాని అట్టి ఒడంబడిక ఎపుడు చేకూరుతుంది ? చేకూరుట కెట్టి పరిస్థితులుండాలి ? మొదట, శాసనోల్లంఘనోద్యమం విరమించాలి. రెండు, భావి రాజ్యాంగ విధానంగూర్చి ఇండియాలో అన్ని పార్టీలకు ఏకీభావం కుదరాలి. వివిధవర్గాల ఆశలున్ను ఇండియాయొక్క అవసరాలతో జతచేసి చూడాలి. అపుడుగాని పోరు పొచ్చులులేని రాజీ కుదురదు. అందరును ఉద్యోగాలకొరకు బేరాలు చేయకుండా, అధికారంయొక్క నిగ్గు సంపాదించుటకు యుక్తులు పన్నుచున్నందున రాజకీయ రాయబారాలు యిపుడంత కఠినంగాను, అసాధ్యంగాను ఉన్నాయి. భారతకీ రాజయములందు నేడు యుద్ధంచేయుటకు ప్లానువేసి కృషిచేయడం అవసరంగాని బేరాలాడుతు అశ్రద్ధవహించడం

కాదు. యుద్ధంలో పాల్గొనుటవల్లనే ఇండియా స్వాతంత్ర్యం సంపాదించే అవకాశం ఉంది. విజయంచేకూరేక అది రూపందాలుస్తుతుంది.

* * *

గాంధి-అక్షరాజ్యాలు

గాంధిగారి 74 వ జన్మదినము అక్టోబరు 2 వ తేదీన. ఆ నాడు అక్షరాజ్యాల రేడియోలు అనేక ప్రత్యేక ఉపన్యాసలు ఇండియా నుద్దేశించి ప్రసారం చేసినవి. ప్రపంచాన్నంతా ఆక్రమించి పరిపాలించాలనే అక్షరాజ్యాల ప్రాజ్ఞ ప్టనకు తోడ్పడు కార్యం ఏదయినాసరే, ఆ కార్యం యితరులు యింకెందుకొరకు తలపెట్టినా సరే ఆ వుద్దేశంతో ప్రసక్తిలేకుండా, ఆ కార్యాలను వాటి కర్తలను బెర్లిను రోము టోకియో ప్రభుత్వాలు పొగుడుతాయని వేరొకసారి రుజువయింది. కాంగ్రెసు నాయకులగూర్చి అక్షరాజ్యాల అంచనాలు ఊహలు కాలమాన పరిస్థితులతోగూడ మారిపోయినవి. వారి దృష్టిలో నేడు వీరులుగానున్నవారు రేపు ద్రోహులుగ మారిపోవచ్చును. తమ పాటకు తాళంవేసినంతవరకే వారిని పొగుడుతారు. గాంధి వారంలో శత్రు రేడియోలు చెప్పినదానిని, అదివరకు కొన్ని నెలల క్రిందట చెప్పినదానిని పోల్చిచూదము. అక్టోబరు 1 వ తేదీన అజదు హిందు జర్మను రేడియో అరవంలో యిట్లు చెప్పింది :—

"గాంధిజి ప్రభుత్వంతో రాజీపడనందుకు, మా భారతీయులు సంతసించుచున్నారు. బ్రిటిషువారితో రాజీపడినచో స్వాతంత్ర్యం కొరకు 50 సంవత్సరాల జీవితం ధారపోసిన గాంధి మహాత్ముని ఉద్దేశమే భ్రష్టగును"

కాని 1942 వ సం॥ ఫిబ్రవరి 4 వ తేదీన బెర్లిను రేడియో ఏమిచెప్పిందో చూడండి :—

"గాంధిగారి అహింసా సిద్ధాంతం ఎందుకు కొరగాకుండా పోయింది కాంగ్రెసు విధానం తడవ తడవకు మారుచున్నందున భారతీయులధిక సంఖ్యాకులు ఆశాభంగంచెంది, త్వరలో స్వాతంత్ర్యం సంపాదించుటకొరకు క్రొత్త పార్టీలు లేవదీస్తున్నారు"

1942 వ సం॥ ఏప్రిలు 10 వ తేదీన బెర్లిను నుండి హిందూస్థానీలో యిట్లు వినబడింది :—

"గాంధిగారు, నెహ్రూగారు గతిలేని బ్రిటిషు ఏజెంట్లు"

అంతకు తొలిరోజునే యిట్లు చెప్పెను :—

"భారతీయ నాయకులు మోసపోయిన లండను అనుచరులు"

[తరువాయి 5 వ పుటలో.]

[2 వ పేజి తరువాయి]

అతనొక్కడే నిర్ణయించి నడిపిస్తూవుంటే యితర సేనానాయకు లాతనికి తోడ్పడుచున్నారనియు అపుడే ఫీల్డు మార్షలు గోరింగు చెప్పివేసెను.

"రష్యను యుద్ధఖైదీలను వేలకొలది ఉరితీసి కాల్చిచంపినందుకు పోలండు, జకోస్లావోకియా, యుగోస్లావియా, గ్రీసుదేశాలలో ప్రజలను బాగా హింసించినందుకు పోలీసు కసాయి హిమ్లరు బిరుదులు ప్రమోషనులతో గౌరవింపబడెను. అతడు ఆపైసాచిక కృత్యాలన్ని జర్మనీలోనే యిపుడు చేయవలసియుంది."

జలాంతర్గాముల ప్రమాదం.

జలాంతర్గాముల ముప్పు యింకను సంయుక్త రాజ్యాలకు చిక్కుగనేయుంది. కాని త్వరలో యిది తొలగగలదు. ఆగస్టు సెప్టంబరు మాసములు, గత పది మాసాలకంటే కొంత నయం. ఈ నెలలలో మునిగిన నౌకల కంటె యెక్కువ వర్తక నౌకలు కట్టబడినవి. ఈ రెండు నెలలో అత్యధికంగా బ్రిటిషుబాంబులు జర్మనీపై పడినవి. ఈ కాలంలోనే అమెరికా సేనలు ఎక్కువ భద్రంగా ఇంగ్లాండు చేరినవి; జర్మనీ ఇటలీ జపానులకన్న బ్రిటిషువారి విమాన శక్తి ఎక్కువని రుజువయింది; సెప్టంబరులో ఆస్ట్రేలియనులు అమెరికను మిత్రులతోకలసి పశిఫికు సముద్రంలో న్యూగినీయందు చాల దూరంవరకు పోయి ఆక్రమించిరి. గొప్పలు చెప్పడం నా కలవాటులేదు. ఇవన్నీ యదార్థంగా జరిగిన విషయాలు. మంచి చెడ్డ రెండు శాంతంగా పరికించి చూసినచో యీ యుద్ధంలో మనం మనోనిబ్బరంతో పట్టుదలతో నుండగల స్థితికి వచ్చితిమని చెప్పవచ్చును.

గౌరవము కొరకేగాక ఆత్మరక్షణ కొరకు ఎన్నడు తెగనటువంటి పవిత్రమగు సఖ్యత ఒడంబడికలు చేసుకున్న వివిధప్రభుత్వాలు జాతులతో మనం కలసియున్నాము. ప్రాణోపద్రవమగు ప్రమాదాలు యింకా మనలను చుట్టియున్నవి. అలసట, అశ్రద్ధ, ధీమా, స్వల్ప విషయాలందు తగువులాటలు కలిగియున్నచో ముందు కార్యంచెడును. మన శక్తినంతా కూడదీసుకొని, ముందువెనకలాలోచించి, తెలివితేటలు ధైర్యం కలిగి అందరంకలసి ముందుకి నడవాలి. దేవుని ఆశీర్వాదంవలన నేటి ఆశలు వమ్మైపోవు మనముందుబాట దివ్యకాంతులతో ప్రకాశించుచున్నది.

# ఇండియాను కాపలాకాయుచున్న విమానాలు.

## ఆకాశంలో రాక్షసులవలె తిరుగుచున్నాయి:

సింహళములో ఎచటనో ఒకచోట రాయలు విమానదళం కంట్రోలు రూములో వాయువార్తా సంగ్రాహకుడు తన తలపై హెడ్‌ఫోనులను సర్దుకొనుచుండును. అతిదూరాన బంగాళాఖాతంపై నెగురుచున్న ఒకని మాటలు వినబడుతూవుంటాయి. ప్రాతఃకాలపు కాపలా విమానాలు రావునకు రిపోర్టు పంపుచున్నవన్నమాట.

ప్రతి రోజు అరుణోదయం కాగానే పెద్ద శబ్దంతో నల్లని నీటిలో సురగల చారలీయుచు విమానం పైకి దర్జాగా ఎగిరిపోతూవుంటుంది. ఇతరులెవరు నిద్రపోతున్నా "ఇండియా కండ్లు" (విమానాలు) మాత్రం మేలుకొని వుంటాయి.

ప్రాతఃకాలంనుండి సాయంకాలం చీకటి పడేవరకు కటాలినా ఫ్లయింగు బోట్సు (నీటదిగే విమానాలు) సముద్రాలపై ఎగురుతూ, సముద్రాంతములనుండి ఇండియాకు ఏమి ప్రమాదం వచ్చునోయని వెదకి చూస్తునేవుంటాయి. ఈ వైమానికుల ప్రపంచమే వేరు. రెండింజనుల విమానలలో దినమంతా గడుపుచు, ఇండియా తూర్పు తీరాన్ని రక్షించుటకు సముద్రా కాశాల మధ్య ఎన్నో అవాంతరాలను దాటుచూవుంటారు.

వారి పని ఎంతకష్టంగా నుంటుందో కొద్ది నెలల క్రిందట కటలినా విమానంపై ప్రాతఃకాలపు కాపలా పనిచేయుచుండిన స్క్వాడ్రను లీడరు బిర్చెలుగారి కథనుబట్టి తెలియగలదు.

ఆ కథ వివరాలెక్కువ తెలియడం కష్టం— ఏమన, బిర్చెలుగారు నీట మునిగిరి. కాని అతన్ని కెరటాలు తమలో కలుపుకునేలోపున అతని వాయువార్త ఒక హెచ్చరిక చేసింది.

మూలస్థానమునందుండిన వాయువార్తాహరుడు ఆ సందేశం వ్రాసుకొన్నందున, సింహళం రక్షణాధికారులు జపాను విమాన దళమును దూరానికి తరుమగొట్టగల్గిరి. తిన్న దెబ్బలు చూసుకుంటూ జపానువారు పారిపోయిరి.

ఇంత ప్రమాదం ఉన్న పని అయినప్పటికి, ప్రాతఃకాలపు కాపలా పని చికాకుగానే ఉంటుంది. వారి విసుగు పోగొట్టుటకు ఒక్క చురుకైన పనైనా జరుగదు. ఇందు పాల్గొనే వైమానికులకు "స్వర్గయోగులు" అంటారు. వారు మేలుకొనియుండే గంటలన్నీ సర్వదా యితర మనుష్యులతో సంబంధంలేకుండా ప్రత్యేక వాయు ప్రపంచంలో గడుపుతారు.

వారు పగలంతా యిందుగా గడిపే విమానాలకు అనేక రహశ్యపు యేర్పాటులుగలవు. 104 అడుగుల వెడల్పుగల రెక్కలు, 1,000 హార్సు పవరుగల రెండు ఇంజనులు, వంటచేసుకోడానికి తగిన వసతులుగ గదులు అందుంటాయి. గంటకు 200 మైళ్లు పోగలవు, చాలదూరం పోగలవు. యుద్ధానికి తగిన ఆయుధాలు పెక్కు అందుంటాయి.

---

(4 వ పేజీ తరువాయి)

ఇపుడు అక్షరాజ్యాల రేడియోలు గాంధిగారిని తెగపొగుడుతున్నాయి. అక్టోబరు 2 వ తేదిన టోకియోనుండి "గాంధి చరిత్రాత్మమగు పురుషుడు, అతని అమాయకత్వం, త్యాగశక్తి, యితరుల చిత్తప్రకారం తిరుగుటకు లొంగకుండుట అతనిలోని విశేషాలు." గాంధిగారి త్యాగాన్ని, భారత దేశాభిమానాన్ని బెర్లిను పొగిడింది. అదివరకు తిట్టడం యిపుడు పొగడడంవలన అక్ష రాజ్యాల నిజోద్దేశం తెలిసిపోయింది. శాసనోల్లంఘనం అక్ష రాజ్యాలకు సహాయకరంగా ఫలించునను ఆశతో కాంగ్రెసు నాయకులను పొగుడుచున్నారు.

ఈ వైఖరికిని సంయుక్త రాజ్యాల వైఖరికిని వ్యత్యాసంచూద్దాం. గాంధిగారి రాజకీయాలతో ఏకీభవించకపోయినా, వారినైతికాధిక్యతను మిత్ర మండలి దేశాల పెద్ద నాయకులు పొగడుచున్నారు. స్మట్సు సేనాని, హాలిఫాక్సు ప్రభువు గాంధిగారి 70 వ జన్మదినోత్సవమున మిగుల ప్రశంసించియుండిరి. ఇప్పుడు, యీ రాజకీయ వివాదాల దుమారంలో తణువులాడు కొంటూకూడ, పెక్కండ్రు ఆశాభంగం చెంది చింతించుచు, కొందరుమాత్రం కోపగించుచున్నారు. ఎందుచేత ? ఇంతటి మహనీయుడు ఉత్తమ నీతిపరుడు తన ప్రజలకు హానికలిగించి శత్రువులకు ఆనందం కలిగించే కార్యం తలపెట్టేదేమా, యని.

# బరువైన బాంబరు విమానాలు.

బ్రిటిషువారి బరువైన బాంబరు విమానాలలో మోయగల మొత్తం బరువులో నాలుగోవంతు బాంబులుండును. ఆధునిక బాంబరు విమానాలన్నంటియందు, బాంబూలకు చోటు తక్కువుంటే పెట్రోలుకి చోటెక్కువ పెట్రోలుకి చోటు తక్కువయితే బాంబులకు చోటెక్కువ యుండును. పెట్రోలు చోటు ఎక్కువైతే విమానం ఎక్కువ దూరం పోగలదు. బాంబులు కొంచెం పెట్టినపుడు పెట్రోలు ఎక్కువ పోయవచ్చును; పెట్రోలు టాంకులు నిండుగానుంటే బాంబు బల్లలు కొంచెం ఖాళీగానుండాలి. కనీసం 4,000 టన్నుల బలువు మాత్రమే బాంబులు నింపినచో విమానం ఎక్కువదూరం పోవడానికి పెట్రోలు టాంకులు పూర్తిగ నింపవచ్చును.

పెద్ద బాంబరు విమానాల విలువ నిర్ణయించుటకు అవి పోయేవేగంకూడా గమనించాలి. బరువు-వడి రెండింటికి అన్యోన్య సంబంధంతో విమానం కట్టబడును. ఇపుడు రెక్కలలో బాంబులు నింపుచున్నారు. చదరపు అడుగునకు 40 పౌనుల బరువు పెద్ద పెద్ద విమానాలలో నుంచబడును. బరువైన బాంబరు విమానాలు దిగే స్థానాలన్నింటియందు, అవి దిగుటకు రోడ్లవలె కట్టుట యిపుడవసరమగుచున్నది. అందుచేతను ఎయిరో మోటారులు అభివృద్ధి చెందుటచేతను, యిపుడు బాంబరు విమానాల వడి గంటకు 220 వరకు పెరిగింది.

ఉత్పత్తి విషయంలో లంకాస్టరు రకం బాంబరు విమానాలు కట్టుటకు అట్టే కాలంపట్టదని అనుభవంవలన తెలియుచున్నది. ఇదివరకు చిన్న బాంబరు విమానాలు నిర్మించేకాలం కన్న తక్కువకాలం యిపుడు లంకాష్టరులు కట్టుటకు అగుచున్నది.

యుద్ధ ప్రారంభంలో అతి బరువైన బాంబరు విమానం మోసే బాంబుల బరువుకన్న నేటి బరువైన బాంబరులు మూడింత లెక్కువ బరువును మోయగల్గుచున్నవి; 2½ రెట్లధికం ఆయుధాలను, సగంమంది వైమానికులను మోయగలదు. పైగా బరువైన బాంబరు వైమానికుల అపాయం సంఖ్యలు యిపుడు తగ్గినవి. బ్రిటిషువారి బాంబరు విమానాలగు లంకాష్టర్లు, హాలిఫాక్సులు, స్టర్లింగులు ఆరేండ్ల క్రిందట కనిపెట్టబడినవి. ఇంతలో యింత మార్పు కలిగిందంటే బ్రిటిషు విమాన పరిశ్రమ ఎంత అభివృద్ధి చెందిందో గమనింపవచ్చును.

# ఇండియాలో మోటారు బండ్ల తయార్.

ఆయుధ రహితమగు మోటారు బండ్ల పైభాగాలను తయారుచేయుట, వివిధ భాగాలను తెచ్చి కూర్చుట ఇండియాలో నిరుడు చాల ఎక్కువగ అభివృద్ధిచెందినది. ఇంకను ఉత్పత్తి ఎక్కువచేయుటకు యత్నములు జరుగుచున్నవి. అనేక వేల బండ్లు పూర్తియైనవి, వారం వారం వాటి ఉత్పత్తి ఎక్కువగుచున్నది. యుద్ధానికి పూర్వం భారతీయ సైన్యంలో యీ బండ్లు 5,000 ఉండెను, యిపుడు 60,000 పైగా వాడుకయందున్నవి.

అనేక కర్మాగారములు యీ దేశంలోనే మోటారు పై భాగాలుకట్టుట చేస్తున్నవి. ఒక కర్మాగారం నెలకు అనేక వేలు మోటారు పై భాగాలు తయారుచేస్తున్నది. ఇందుకు కావలసిన వస్తు సామగ్రి విశేషంగానుంది. ఉక్కు, కలప, కాన్వాసు మున్నగునవి ఎంతో ఎక్కువగ ప్రతి వారం కర్మాగారాలకు అందజేయబడుచున్నవి. చేసీసులు (ఇంజను, చక్రాలతోగూడిన లో భాగములు) రైళ్లనిండా ప్రతి రోజూ వస్తున్నవి.

మోటారు టైరుల ఉత్పత్తిగూడ దీనితోబాటు ఎక్కువైంది, ఇంకా ఎక్కువచేయుటకు ఏర్పాటులు చేయబడెను. సైన్యానికి కావలసిన అధిక బరువైన టైరులు ఇపుడు ఇండియాలోనే తయారగుచున్నవి.

# ఇరుసు రాజ్యాల తలబిరుసు జాడ్యాలు.

ఈ మహా సంగ్రామమును ప్రారంభించిన వాడు హిట్లరు. ఇతర రాజ్యాలమీదకు ముమ్మందుగా కయ్యమునకు కాలు దువ్వినవాడు హిట్లరు—మహా సంగ్రామ మొకటి చేసితీరవలెననే మహా సంకల్పంతో బ్రహ్మాండమైన ప్రయత్నం బహుకాలంనుంచీ చేసినవాడు హిట్లరు ఇంగ్లాండు, ఫ్రాన్సు మొదలైన పెద్ద రాజ్యాలవారు లోక శాంతి కొరకై తమతమ ఆయుధ బలములను తగ్గించి, నిగ్రహించి, వీలైనంతవరకు విసర్జించవలెనని సంకల్పించి సభలు చేయుచుండిన గత 20 సంవత్సరములలో, జర్మనీకూడా ఆయుధ విసర్జనము మంచిదనియెంచి, ఆ సభలకు విచ్చేసి విషయములన్నీ చర్చించి, ఆయుధములను అన్ని రాజ్యాల వారున్నూ తగ్గించడమే ఉత్తమమని నొక్కి వక్కాణించి పైకి శ్రీరంగనీతులు చెప్పుచూ, లోలోపల జర్మను ఫ్యాక్టరీలలో లెక్కకు మిక్కిలిగా టాంకులు, విమానాలు, బాంబులు మొదలైన వివిధ ఘోరమారణ సాధనములను తయారుచేసినది. ఈ విధంగా జర్మనీ ప్రభుత్వముయొక్క ఆదాయ ద్రవ్యములోని విశేష భాగాన్ని, ఏటేట ఆయుధ నిర్మాణము కొరకు ఖర్చుపెట్టించి జర్మనిని యుద్ధంలోకి దింపిన దెవరు? హిట్లర్!—ఈ విధంగా జర్మనీని యుద్ధానికి దింపిన హిట్లరు, జర్మను ప్రజల సమ్మతితో జర్మనీలోని ప్రజల సంప్రతింపుతో యీ పని చెయ్యలేదు. హిట్లరు తన స్వతంత్ర సంకల్పానుసారంగా సర్వతంత్ర స్వతంత్రాధికారియై, ప్రజాభిప్రాయంతో నిమిత్తం లేకుండా, ప్రజాభిప్రాయం పాటించకుండా, బ్రహ్మాండమైన యుద్ధంలోనికి జర్మను ప్రజలను దింపి చంపుచున్నాడు. ప్రజలను నిర్బంధ విధిగా పటాలములో చేరవలెననియు, సైనిక శిక్షణ పొందవలెననియు శాసించాడు. ప్రతి జర్మను యువకుడున్నూ యుద్ధానికి సిద్ధముగా ఉండవలెనని బలాత్కరించాడు. ఈ విధంగా యీ సంగ్రామమునకంతకు, మూలకారకుడు హిట్లర్. ఈ జన సంహారమునకు బాధ్యుడు అతడేగాని, జర్మను ప్రజలుకారు. హిట్లరుయొక్క ఆజ్ఞలకు ఎదురు జవాబు చెప్పుటకు వీలులేదు. అందుచేత జర్మను సైన్యాలు యుద్ధంచేసి తీరవలెను.

సైనిక ధర్మముల ప్రకారముగా మిలిటరీ రూల్సుననుసరించి ప్రతి సైనికుడు తన సైనికాధికారి యిష్టానుసారం యుద్ధంలో ఏపని చేయవలెనంటే ఆ పని చేసితీరవలెను. ఆ ప్రకారంగా చెయ్యనియెడల, ఆ సైనికుడు మరణదండనకు పాత్రుడవుతాడు. కనుక, యుద్ధములో జరిగే ఘోర కార్యములకు సైనికులు బాధ్యులుకాజాలరు. ఇది యుద్ధ ధర్మనీతి. అన్ని రాజ్యాల వారూ అంగీకరించిన ప్రత్యక్ష సిద్ధాంతం. కనుక యుద్ధంలో శత్రు సైనికులు మన చేతులలో చిక్కి పట్టుపడినప్పుడు, ఆ శత్రు సైనికులను మనము మనవశమందుంచుకొనవచ్చును. వారి ఆయుధములను తీసికోవచ్చును. కాని, యుద్ధ సంహార కార్యములకు వారిని బాధ్యులుగా భావించి పీడించడం అధర్మం. కనుక యుద్ధములో పట్టుకోబడిన ఖైదీలను సామాన్య నేరస్థులవలె హింసించి, దండించడం, అక్రమం, అధర్మం. ఇది అంతర్జాతీయ నీతినియమం. యుద్ధనీతి నియమముల విషయమై అన్ని జాతులవారున్నూ ఇదివరలో జినీవాలో ఒక ఒడంబడిక వ్రాసుకొన్నారు. ఆ ఒడంబడిక లోని రెండవ నిబంధనలో యీ విషయం స్పష్టంగా నిర్వచింపబడి ఉంది. యుద్ధములో పట్టుకోబడిన శత్రు సైనికులను యుద్ధ ఖైదీలకు సంకెళ్లు వేయుట కూడదు. వారిని పీడించి హింసించరాదు. యుద్ధం ముగిసేవరకు అట్టి యుద్ధ ఖైదీలను మర్యాదగా అన్నవస్త్రములకు దేహపోషణకు లోపం లేకుండా చూచి ఆదరించవలెను. తిరిగి శత్రు పక్షములోనికి తప్పించుకొని పారిపోకుండా తమవశమందు ఉంచుకొని ప్రవాసంలో ఉంచబడినవారి పై పహారా ఉంచవచ్చును. ఇది అంతర్జాతీయ నీతి నియమం.

కాని, ఇటీవల ఫ్రాన్సుకోస్తాలోనున్న డీపే అను రేవుపట్టణముమీదకు కొన్ని బ్రిటిష్ సేనలు దండయాత్ర జరిపినప్పుడు, అక్కడ జరిగిన యుద్ధములో కొందరు బ్రిటిష్ సైనికులు జర్మనులకు ఖైదీలుగా చిక్కినారు. ఈ యుద్ధ ఖైదీలను జర్మను సైనికాధికారులు పట్టుకొని తీసికొనిపోయి ప్రవాసములో ఉంచినారు. ఆ యుద్ధ ఖైదీకు క్రిందటి వారంలో చేతులకు సంకెళ్లు వేయడమైనదని జర్మను రేడియోలో జర్మను అధికారులు ప్రకటించారు. 107 మంది బ్రిటిష్ సైనికాధికారులకున్నూ, 1,269 బ్రిటిష్ సైనికులకున్నూ వెరశి 1,376 మందికి అక్టోబరు నెల 3 వ తేదిని చేతులకు సంకెళ్లు వేయబడినవని జర్మను అధికారులు ప్రకటించారు.

ఇందుకు జవాబుగా బ్రిటిష్ గవర్నమెంటు వారు యీ క్రింది రీతిగా ప్రకటన చేసారు :—

"యుద్ధ ఖైదీల చేతులకు బ్రిటిష్‌వారు సంకెళ్లు వేయుటలేదు. జర్మనుల వశమందున్న బ్రిటిష్ సైనికులకు జర్మను అధికారులు సంకెళ్లు వేయడం జినీవాలో వ్రాసికొన్న అంతర్జాతీయ ఒడంబడికకు విరుద్ధమైయున్నది. బ్రిటిష్ సైనికులకు జర్మనులు సంకెళ్లు వేసినయెడల జర్మను సైనికులకు యుద్ధ ఖైదీలకుకూడా బ్రిటిష్‌వారు సంకెళ్లు వేయుదురు." ఈ విషయమై అధిక్షేపిస్తూ ఒక మధ్యస్థ తటస్థ రాజ్యంద్వారా బ్రిటిష్‌వారు తమ అధిక్షేపణను జర్మను ప్రభుత్వానికి తెలియజేసారు. జర్మను ప్రభుత్వముయొక్క జవాబుకొరకు ఎదురు చూస్తున్నారు.

జర్మనీకంటె ఎక్కువ ఘోరంగా యీ విషయంలో జపాను ప్రవర్తించింది. హాంకాంగులో బ్రిటిష్ సైనికులు చాలామంది జపానువారికి యుద్ధ ఖైదీలుగా చిక్కినప్పుడు, నిరాయుధులైన ఆ యుద్ధ ఖైదీలను జపాను సైనికులు అతి ఘోరంగా హింసించినారు. చేతులు విరిచి చెట్లకు కట్టి, కత్తులతో పొడిచివేసినారు. మిగిలిన ఖైదీలకు ఆహార సౌకర్యములు, నివాస సౌకర్యములు లేకుండా నీచమృగములకంటె హీనంగాచూచి హింసల పాలుచేసారు. వైద్య సహాయం లేనే లేదు.

జర్మనీ తన యుద్ధ తంత్రం సాగించుట కొరకై స్వదేశంలో ఎన్ని ఘోరకార్యాలు చేస్తున్నదో ఇతర దేశాలలోకూడ అన్ని ఘోరకార్యాలు చేస్తోంది. జర్మనీకి యీ యుద్ధంలో విజయం లభించును లభించదాయని సందేహిస్తూ మాట్లాడినందుకై జర్మనీలో వేయి మంది జర్మనులకు శిక్షలు విధింపబడెను. శిక్షింపబడినవారిలో విద్యార్థులు చాలామంది ఉన్నారు. వారిలో స్త్రీలు చాలామంది కలరు. స్వదేశంలో జర్మను ప్రభుత్వం యీ ప్రకారంగా రాక్షసంగా వ్యవహారించి మరణ దండనలు విధిస్తోంది. బయట దేశాలలో ఇంతకన్నా ఘోరంగా వ్యవహరిస్తోంది. రష్యాలో జర్మనుల వశమందున్న రాస్టొవు నగర వీధులలో వందలకొలది వేలకొలది రష్యను పౌరులను, నిరాయుధులగు పౌరులను జర్మనులు తుపాకులతో కాల్చి చంపివేస్తున్నారు. రష్యాలోని ఒడెస్సానగరంలో వేలకొలది రష్యనులను అచట బారకీసులలో బంధించి మందు తోటాలు పెట్టి ఆ బారకీసులను పేల్చి ఆ జనాన్ని భస్మం చేసారు.

జర్మనీ తన యుద్ధ తంత్రములోనకు అండగా ఉండవలెనని ఇటలీనిన్ని, జపానునున్నూ తన పక్షములో చేర్చుకుంది. ఈ మూడు రాజ్యాలున్నూ కలిసి ప్రపంచ చక్రాన్ని తిప్పటకు ఒక యిరుసుగా ఏర్పడవలెనని హిట్లరు సంకల్పించాడు. అందుకనే ఈ కూటంలో చేరిన రాజ్యాలకు అక్షరాజ్యాలని హిట్లరు నామకరణం చేసాడు. "అక్ష" అనేది సంస్కృత పదం. "ఇరుసు" అనేది తేట తెనుగుమాట. ఈ యిరుసు రాజ్యాలవారు ప్రపంచ చక్రాన్ని తిప్పటకోసం ఒక్క కూటంగాచేరి, పరస్పర స్నేహ సంబంధం ఒకటి ఏర్పరచుకొన్నారు. మైత్రి పత్రాలు వ్రాసుకొన్నారు. అంతర్జాతీయ నీతి నియమాలున్నూ, సహజమానవ ధర్మాలున్నూ పాటించనటువంటి యీ తలబిరుసు రాజ్యాలు తమలో తాము వ్రాసుకొన్న మైత్రి పత్రాలను మాత్రం ఏ విధంగా ఎంతవరకు పాటించగలవు? జర్మనీ మీద జపానుకు అభిమానమున్నదా? తెల్లవాళ్లను ఆసియా ఖండంలో అడుగుపెట్ట నివ్వకూడదని జపానువాళ్లు గర్జిస్తున్నారు. జపానువాళ్లంటె జర్మనీకి అభిమానమున్నదా? హిట్లరు తన "మీన్ కాంఫ్" అనే పుస్తకంలో చాలా ఏళ్ల క్రిందటనే జపానుజాతిని దూషిస్తూ నిందిస్తూ వ్రాసినాడు. హిట్లరు తన కంటె బలవంతుడై విజృంభిస్తే మస్సులోనికి హిట్లరుయెడల, యీర్ష్యగాని అనుమానంగాని లేదంటే యెవ్వడైనా నమ్మగలడా? ఈవిధంగావుండే ఈ యిరుసు రాజ్యాలు ఒక్క కూటంగా నిలువబడగలవా? అక్రమానికి అధర్మానికి వెనుదీయని రాజ్యాలు, తమలో తాము సక్రమంగా ధర్మబద్ధంగా ఉంటాయా? ఈ యిరుసు రాజ్యాలు ఏ తలబిరుసు జాడ్యంచేత యీ మహాసంగ్రామం ప్రారంభించినవో, ఆ తలబిరుసు జాడ్యంచేతనే తల క్రిందులవుతాయి. ఈనాడు యుద్ధ ఖైదీలకు యిరుసు రాజ్యాలవారు ఇనుప గొలుసులు తగిలించి బంధిస్తే, రేపటి రోజున వారిలో వారికే అయికమత్యత చెడినప్పుడు, యిరుసు విరిగినప్పుడు, తమ చేతులకు సంకెళ్లు తామే తగిలించుకొన్నవారవుతారు. ఇనుపగజ్జెల తల్లి వారి రాజ్యాలలో తాండవింపక తప్పదు. జర్మనీ యొక్క జనం రష్యాయుద్ధంలో సర్వనాశనమవుతూవున్నది. జర్మనీ దేశంలోనే అంటు జాడ్యాలవల్ల మరణ సంఖ్య హెచ్చుతున్నది. 1933 వ సం॥లోకంటె 1942 వ సం॥ మొదటి మూడు మాసాలలో జర్మనీలోని పెద్ద పట్టణాలలో శిశు మరణములు చాలా హెచ్చినవి. వేయింటికి 74 మంది చొప్పున మరణించారు. 1937-38 వ సంవత్సరములలో సగటు సుమారు సంవత్సరం 1 కి క్షయ

(మిగతా 11 వ పేజీలో)

# స్టాలినుగ్రాడు

●

## విచిత్రమానవుల కేంద్రస్థానం.

●

ఒక రష్యను కవి వర్ణన.

●

కేన్స్టాంటిను సుమనోవ్ అను రష్యను కవి స్టాలినుగ్రాడునుండి మాస్కోనగరానికి వచ్చి, ఆ నగరంలోనుండి రక్షించుకొనుచున్న ప్రజల అద్భుత చర్యలను, మంచి కట్టుబాటులను వర్ణించెను.

కాలిపోయిన అనేక అంతస్తుల మేడలోని దిగువ గుహావంటి గదిలోనున్న కొందరు మనుష్యులు యీ విడ్డూర్వపు కార్యములు చేయుచున్నారు. రాత్రి నక్షత్రాలతో మిణుకు మిణుకు మను ఆకాశంలో యీ పాడుమేడ అస్తిపంజరం వలె కనబడును.

వీధిలోనుండి లోతైన మెట్లగుండా దిగువ భాగాని పోతాం. ద్వారంవద్ద ఇనుకబస్తాలుండి అది రక్షణ గుహవలె అగుపడును. లోపల చీకటిలో యింకా ఎన్నో మెట్లుంటాయి. ఇచట పాడుబడిన యింటి అడుగున త్రవ్వి కట్టబడియుంది ముఖ్యకార్యాలయం. స్టాలింగ్రాడు రక్షణ సేనాధిపతి యిచట బలమైన కొయ్య దూలాలతో నిలచియున్న చీకటి గదిలో నుంటాడు. అతని పేరు యిపుడు తెలుపబడదు. క్రమేణ సుప్రసిద్ధమవుతుంది.

### క్రొత్త డంజను.

క్రొత్తగ నేర్పడిన యీ డంజను గదిలో నెలరోజులనుండి విరామంలేకుండ సైనికోద్యోగులు పనిచేస్తున్నారు. రాతబల్లవద్దనే బ్రెడు, దుంపలు తింటూవుంటారు. ప్రతిరోజు వేడి కాబేజి పులుసు, మాంసం వంటకం వీరి ఆహారం. ఆ గుహ గదిలో గాలి కల్మషంతోకూడిన దగుటచే అగ్గిపుల్లలు వెలగవు.

స్టాలినుగ్రాడు యుద్ధరంగము దక్షిణమున ముందుభాగాని ఉన్న సేనానాయకుని కేంద్రస్థానానికి గుహనుండి ఒక ఉద్యోగి టెలిఫోను చేస్తాడు. ఈ దక్షిణ భాగంలోనే అపుడు తీవ్ర యుద్ధం జరుగుచుండెను. ఆ సేనానాయకుని కార్యాలయం 5 వ అంతస్తులో ఒక ఇంజనీరు భోజనాల హాలులో నుండును. ఆఫీసరులు ముఖమలు కుర్చీలపై కూర్చుంటారు. ఒక నల్ల చావకర్ర టేబిలుపై మిలిటరీ మ్యాపులతో బాటు, పిల్లవాళ్ల ఎక్సరసైజు పుస్తకంకూడ ఒకటి ఉంటుంది. కిటికీవద్ద కుండగోలేలలో పూలచెట్లుంటాయి.

### దారుణమగు దాడి.

జర్మనులను చూచుటకు దూర్భిణిఅద్దా లక్కరలేదు. ఒకడు మోటారు సైకిలుమీద వస్తాడు. ఇచటనే ఎర్రగార్డు సైనికదళంపై గతవారంనుండి శత్రువులు దారుణమగు దాడి జరుపుచుండిరి. మామూలు ప్రకారం జంకరు విమానాలు, ఫిరంగులతో మెరుపు యుద్ధం ప్రారంభించి, తరువాత 200 టాంకులు, వాటివెనుక మోటారుల సహాయంతో కాల్బలం సైనికులను పంపిరి. ఒకే రోజున 12 సారులు దాడిచేసిరి. 42 టాంకులను ఎర్రగార్డుల ఫిరంగి దళాలు పడగొట్టిన తరువాత, జర్మనులు ఎదురుదాడి మానివేసి, ప్రక్కల నుండి టామీ గన్నరులను పంపి దొంగదాడి చేయ ప్రారంభించిరి.

ఇచ్చట ఒక్క పొడుగాటి మేడలో తీవ్రయుద్ధం జరిగింది. జర్మనులు ప్రతి అంతస్తు నాక్రమించి, భవనం చేరే మార్గాలపై మీదనుండి గుండ్లు ప్రేలుస్తున్నారు. అయినను ఎర్రసైనికులు లోపలకు పోయిరి. మొదటి అంతస్తు నుండి రెండో అంతస్తువరకు యుద్ధం చేసిరి, ప్రతి వసారాకొరకు యుద్ధం చేసిరి. అనేక గదులు చాలసారులు చేతులు మారినవి. కాని జర్మనులను తరిమివేయలేక పోయిరి. కావున భవనం కాల్చివేయాలని నిశ్చయించిరి.

ఐదుగురు రష్యను సైనికులు పైనుండి గుండ్లు ప్రేలుచుండగా చెరి 25 పౌనుల మందుగుండు పుచ్చుకొని భవనం చేరిరి. భవనం దహనంచేసి జర్మనులను అందు కాల్చివేసిరి. ఈ ఐదుగురు ఆ ప్రేలుడు భవనంనుండి తప్పించుకొన్నారో లేదో నాకు తెలీదు. బహుశ తప్పించుకోలేరు.

### జర్మనులు తరిమివేయబడుట.

ఈ దక్షిణరంగమునందే జర్మనులు వెనుతగ్గి ఆత్మరక్షణ చేసుకోవలసి వచ్చింది. రష్యను కమాండు కార్యాలయం కిటికీలోనుండి కనబడు నంత దగ్గరలో నొక మూల త్రవ్వుకొని జర్మనులు దాగొనియున్నారు. చిన్న అమెరికను జీపు యంత్రంలో పోయినచో ట్రాఫికు కనిస్టేబు ఉండేచోట నున్నవాడు క్రొత్తవాడని, టామీగన్ను ధరించి

యున్నాడని తెలుసుకోవచ్చును. కనిస్టేపుని గంట క్రిందట గుండుతో ప్రేల్చి చంపిరి.

ఇచటొక స్టాలినుగ్రాడు కర్మాగారం గలదు. ఇది చాల పెద్దది. అందలి పనివారు పనిచేస్తూనే, మధ్యమధ్య అవసరం వచ్చినపుడు యుద్ధం చేస్తున్నారు. గతవారం జర్మనులు యీ కర్మాగారంపై బడిరి. రిపెయిరుశాఖ పనివారు తాము మరమ్మతు చేస్తున్న టాంకులలో దుమికి, వెంటనే గేటులుదాటి యుద్ధరంగంలో చేరిరి. వారివెంట హోముగార్డు బాటాలియను పనివారు, ప్రఫెసరు పచాంకోగారి నాయకత్వమున పోయిరి. ఇంకో బటాలియను సైనికులు స్టాలినుగ్రాడు ప్రధాన కనిస్టేపు క్రిగులిను వీరు నాయకత్వమున వెడలెను.

తండ్రులను అనుసరించి.

వారు సామాన్య కార్మిక దుస్తులతోనే పూర్వం తమ తండ్రులు విప్లవ సమయమున యుద్ధం చేసినట్లు యుద్ధం చేసిరి. వీరిలో కొంద రానాడు కూడ యుద్ధం చేసియుందురు. వారు తమ భార్యలు కుమార్తెలతోగూడ యుద్ధానికి పోయిరి. స్త్రీలు మందుగుండు ఆహారపదార్థములు తెచ్చిరి. యువతులు ట్రెంచీలలోకిపోయి గాయపడినవారికి చికిత్సచేసి, వారిని తిరిగి కర్మాగారానికి మోసుక పోయిరి. సాయంకాలంవరకు ఒక రాతివంతెన వద్ద విడువక నిలచేసరికి, అపుడు ఎర్రగార్డ్సు సైనికులు వచ్చిరి. వారు రాగానే, పనివారు తిరిగి తమ ఫ్యాక్టరీకిపోయి తమ మామూలుపని, టాంకులు తయారుచేయుట ప్రారంభించిరి.

వోల్గానదిపై చంద్రుడు కనబడలేదు. నదిపై సప్లయిలు తెచ్చు నావల పొగతో చంద్రుడు కప్పబడిపోయెను.

ఆడవారుకూడ పనిచేస్తున్నారు. వారు ఎర్ర సైన్యం నర్సులు; ప్రథమ చికిత్స స్థానాలదాటి, నదిమీదుగ గాయపడినవారిని చికిత్సకు తీసుక పోవుదురు. గాయపడినవారందరిని యీ బాలికలు వాల్గానదిపైని తీసుకపోయి, లారీలపైని అస్పత్రికి తీసుకపోదురు. రక్తశిక్తమయి, నరకంగానున్న స్టాలినుగ్రాడు నగరానికి అది చాల దూరంగా నుండును.

వారు దిగేసరికి ఒడ్డున నల్లని దుక్కలు కాలిన స్టీమరు ప్రక్కన పడియుండెను. దుక్కలా? కావు. ప్రమాద స్థలంనుండి భద్రమగు స్థలానికి స్టీమరులో పోతున్న స్త్రీలు బిడ్డల యొక్క శవాలు, స్టీమరు బాంబుచే కాలిపోయినపుడు చచ్చి ప్రక్కన పడియున్నారు. స్టాలినుగ్రాడు విడచి పోప్రయత్నించిన స్త్రీలు బిడ్డలు పలువురు చనిపోయిరి. ఇపుడు కాలుచున్న స్టాలినుగ్రాడు నగరంలో ఎవ్వరు మిగలలేదు. ఇంకను మిగిళియున్న ఇండ్లు ఖాళీగా ఉన్నాయి.

## మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

గాయపడినవారు.

| నెంబరు. | హెూదా. | | పేరు. |
|---|---|---|---|
| ఐ ఎ ఒ.సి — | | | |
| ఒ/72009 | సిపాయి డ్రైవరు. | | పి. షణ్ముగ తేవరు |
| ఐ. హెచ్.సి.— | | | |
| హెచ్/85520 | సిపాయి | .. | ఎస్. మహమ్మదు. |
| జి ఎస్ /8068 | నౌఖరు | ... | మహమ్మదు ఇస్మేలు. |

కనబడక యుద్ధ ఖైదీలుగ నున్నట్లు ఎంచబడినవారు

| | | | |
|---|---|---|---|
| ఐ.ఎ ఒ సి.— | | | |
| ఒ/73213 | సిపాయి/డ్రైవరు | | సి కె. అచ్చుతన్ |
| ఒ/72681 | సిపాయి/డ్రైవరు. | | ఎ. కేశవన్నాయరు. |
| ఒ/1414 | వంట | ... | ధరమ రాజు |
| ఒ/32320 | ఫిట్టరు | ... | ఎం కేశవ రామచంద్ర పిళ్లె. |
| ఒ/33362 | ఎలక్ట్రికు | ... | మనీంద్రనాదు చక్రవర్తి. |
| ఒ/104281 | కార్పెంటరు | . | వి మురుగేశ నాయకరు. |
| ఒ/102785 | ఎలక్ట్రికు | ... | నిత్యానంది |
| ఒ/105250 | లా/నాయకు | ... | పరశురాం |
| ఒ/102845 | ఫిట్టరు | .. | కె. పర్వకుట్టి. |
| ఒ/105254 | సిపాయి | ... | పాలకొల్లు పోలయ్య. |
| ఐ.హెచ్.సి.— | | | |
| 86069 | సిపాయి | | కల్యాని. |
| 86154 | సిపాయి | . | ఎస్. కృష్ణ రావు. |
| 186687 | ... | | కృష్ణ. |
| 85844 | సిపాయి | . | కృష్ణ జాదవు |
| 85099 | సిపాయి | ... | కృష్ణమూర్తి. |
| 186752 | స్వీపరు | .. | మునుస్వామి. |
| 18584 | హవల్దార్ | ... | కె. మూర్తి. |
| 40043 | సిపాయి | ... | కె. కె నంబియారు |
| 85499 | సిపాయి | ... | పెరియస్వామి. |
| 186009 | వంట | ... | రామ రెడ్డి. |
| 85498 | సిపాయి | . | రామస్వామి. |
| 210755 | నాయక్ | ... | సదానందస్వామి. |
| 8641 | హవల్దార్ | ... | వి. శల్వనాయగం, |

# బర్మనులకు నల్లమందు అలవాటు చేయుట.

## వశపరచుకోడానికి జపాను తంత్రం.

జపాను ఆక్రమించిన బర్మాలోనికి పోయివస్తున్న భారతీయ గొరిల్లా సైనికులు, బ్రిటిషు గొరిల్లా సైనికులును తిరిగివచ్చి, అచట బర్మనులకు జపాను వారు నల్లమందు మున్నగు నిషా వస్తువులు అలవాటు చేస్తున్నారని చెప్పుచున్నారు. నల్లమందు, హెరోయిను అను నిషా పదార్థములు సరఫరా చేయబడు గూడెములు జపానులోని అవినీతిపరులు నడిపించునవి మాండలే, రంగూనుమున్నగు పెద్ద నగరాలన్నింటిలో బయలుదేరుచున్నవి.

చీనా మున్నగు ఆక్రమిత దేశాలలో జపాను అధికారులు బుద్ధిపూర్వకంగాచేసిన పనులే యిక్కడను చేస్తున్నారు. మంగోలియాలో ప్రత్యేకంగా కొన్ని ప్రాంతాలు చిరకాలంనుండి నిషా మొక్కలు నాటి ఓషధులు తయారు చేస్తున్నారు. అక్కడనుండియే యిపుడు బర్మాకు తెస్తున్నారు.

ముఖ్యంగా బర్మాలో గ్రామాలందుండు సామాన్య ప్రజకు జపాను అధికారులు యీ నిషా అలవాటు చేస్తున్నారు. బర్మను రయితులు యిటీవల తమ పంటలతో రంగూను వచ్చినపుడు, జపానువారిచే నిర్వహింపబడిన నిషా దుకాణాలు ఎక్కువగాంచిరి. పెక్కుంట జనం నిండుగనున్నారు.

రయితుల్లు తమపంటలు అమ్ముకోగానే, జపాను ఏజెంట్లు వారివద్దకు వచ్చి చాల చవకగ నిషా ద్రవ్యాలిచ్చి వాడి చూడమంటారు. హెరోయిను, మార్ఫైను, నల్లమందు విక్రయిస్తున్నారు. కొందరు బర్మను లపుడే వాటికి అలవాటు పడిరి.

రయితులను యీ నిషాలకు అలవాటుచేస్తే, చివరకు వారు దివాలాతీసి, తమ పశువులను పొలాలను తమకే అమ్మివేస్తారని జపానువారి ఎత్తు చీనాలో యిట్లేచేసిరి.

నేడు బర్మా అంతటను జపానువారు చిన్న వర్తకులను తొలగించి, పెద్ద జపాను సంస్థలు అన్యోన్య సంబంధంగలవాటిని స్థాపిస్తున్నారు. చిన్న వర్తకుని తొలగించుటకు నల్లమందొక సాధనము.

ఇంకో దురుద్దేశం వారికి గలదు. దేశభక్తిగల బర్మనులు యీ నిషాకు అలవాటుపడితే, తమకు చెయ్యిలోంగి, పంచమవళం మనిషిగా (ద్రోహిగ) మారతాడని వారి ఆశ.

బర్మాలోనున్న జపాను ఉద్యోగులు, ఆర్మి ఉద్యోగులకుగూడ యీ నల్లమందు దుకాణములందు అభిమానం శ్రద్ధగలదు. కాని కారణంవేరు. ఈ అవుషధుల విక్రయంవలన వారికి చాల లాభాలు వస్తాయని తెలుస్తున్నది.

700 పైగా జపాను వర్తకులు కుటుంబాలతో గూడ రంగూనునుండి మోల్మేను వచ్చిరి. జపాను వర్తకులు డబ్బా ఆహార పదార్థములు మందులు విక్రయించువారు, యీ వ్యాపారంకూడ చేస్తూవుంటారు. బర్మా నగరాలలో తమ సామాన్య కిరాణీ వ్యాపారం చేస్తూ, నగరంలో యింకో భాగమున లేదా ఆ దుకాణంలోనే యింకో రహస్యమగు గదిలో నిషా ద్రవ్యాలిచ్చు వ్యాపారం పెట్టుకుంటారు. అక్కడ బర్మనులకు కొద్ది అణాలకే నల్లమందు, హెరోయిను దొరుకుతాయి.

---

[8 వ పేజి తరువాయి.]

వ్యాధివల్ల జర్మనీలో (పెద్ద పట్టణాలలో) మరణించిన వారికంటె, 1941 వ సం॥లో నూటికి 34 చొప్పున ఎక్కువమంది క్షయవ్యాధులవల్ల మరణించారు. ఇదంతా యుద్ధ ప్రభావం ఇదంతా ఇరుసు రాజ్యాల తలబిరుసు జాడ్య ప్రభావం. ఇరుసుగాని, ఇనుప గొలుసులుగాని, ప్రపంచమునకు అంతర్జాతీయ బంధములు కాజాలవు. గొలుసులతో యుద్ధ ఖైదీలను బంధించినా, ఈ ప్రపంచం ధర్మబద్ధమై ఉండగలదుగాని, శృంఖలాబద్ధమై యుండజాలదు. ఆ ఇరుసు రాజ్యాల తలబిరుసు పోగొట్టుటకే బ్రిటిష్‌వారు శస్త్ర చికిత్స చేస్తున్నారు.

# జపాను - సయాం.

## క్రొత్త చట్టాలు, పత్రికల నిషేధము, నిర్బంధపు చాకిరీ.

సయాం దేశం జపానుతో కలియుటవలన ఎంత లాభం పొందిందో చూడాలంటే, 'లాభం' అనే పదానికి జపాను జర్మనీలు చెప్పే నిర్వచనం తెలిసికోవాలి. కఠిన కంట్రోలు నియమాలను అనుసరించుతూ, అధికమయిన పన్నులు చెల్లించుచు, వాక్స్వాతంత్ర్యము ఎన్నికలు లేక జీవించుట తమ దేశీయులకే మంచిదయినపుడు, తమకు లోబడియున్న దేశాలకుగూడ శ్రేయస్కరమే అని యీ రెండుదేశాల పాలకులు చెప్పుచుందురు. అంతేకాక పాలక జాతుల అవసరాలకు తగిన సప్లయిలుచేయు గౌరవంకూడా వారికి లభించును.

జర్మను ట్రాంసుమిషను ఏజన్సీ, జపాను డోమై ఏజన్సీ వార్తలు పైవిధంగా చాటుతూ వుంటాయి. సయాంలో క్రొత్త పత్రికాశాసనం ప్రకారం దేశీయ పత్రికల సంఖ్య సగం తగ్గించబడినదని గత వసంత కాలంలో డోమై ఏజన్సీ ప్రకటించెను. క్రొత్త చట్టంప్రకారం క్రొత్తగ ఎన్నుకొనబడిన సభ్యులు ప్రధాన మంత్రి, మంత్రివర్గము, శాసనసభ ఆమోదిస్తేగాని పార్లమెంటులో స్థానా లాక్రమించరాదని సయాం అధికారుల రేడియో బాంగ్‌కాకునుండి జూను 19 వ ప్రకటించెను. రాజకీయంగా యీ సూక్ష్మనిషేధంతో ప్రారంభించి, క్రమేణ జపాను ఆర్థిక కఠిన నియమాలుకూడ అమలు జరుపును.

వేసంగిలో అన్ని వస్తువులు కాల్రప్రకారం యిచ్చు రేషనింగు పద్ధతి అమలు జరుపబడెను. ఆహార పదార్థముల కంట్రోలు జూలైలోనే ప్రారంభమయింది. అధికారులు భవనాలు, స్టోర్సు, నౌకలు అన్ని వెతకి నియమవిరుద్ధంగా ప్రవర్తించినవారికి 10,000 టికల్సు (సుమారు 1,000 పౌనులు) జరిమానా విధించుటకు అధికార మొసంగబడెను. ఈ నేరాలు యికముందు సివిలు కోర్టులు కాక మిలిటరీ కోర్టులు విచారింతురని ఆగస్టు 13 వ తేదీన ప్రకటించబడెను.

జపానువారి ఒత్తిడి యింకా అధికమగుచున్నట్లు ఆగస్టు 2 వ తేదీన బాంగ్‌కాకు రేడియో ప్రకటనవల్ల తెలియగలదు. "జర్మనులో నిర్బంధపు చాకిరీ పద్ధతి బాగా పనిచేయుచున్నదని చెప్పి, సయాంలోకూడ ఆ పద్ధతి అమలు జరుపుటకు ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారని తెలిపెను. కార్మికులందరు యికముందు ప్రభుత్వ పనివారవుతారు. పనిచేయకుంటే క్రొత్త మిలిటరీ శాసనానికి గురియగుదురు" అని ప్రకటించబడెను.

### జపానుపై ద్వేషం.

బాంగ్‌కాకు ఒక్కొక్కప్పుడు జపానువారి "సమాన అభివృద్ధి ప్రాంతీ"య వాదమునకు ఎక్కువ ఉత్సాహం చూపదు. సయాంనుండి విశేషంగా బియ్యం జపానుకి చేరిందని జపాను చెప్పుకుంటూవుంటే, జూలై 31 వ తేదీన బాంకాకు యిట్లు స్పష్టంగా తెలిపింది :—"మాకు విదేశపు సరకు రావాలంటే జపానునుండి మాత్రమే రావాలి. మాకు కావలసినవన్ని జపానునుండి రావు. ఏమన జపానుకే సయాంలోకన్న ఎక్కువ సరకు అవసరంగా వుంది. సయాం కొరకు వస్తువులు తయారుచేయుటకు జపానువారికి వ్యవధిలేదు."

కొద్దిరోజులు గడచినాక యింకా గుట్టు బయటపడింది. ఆగస్టు 9 వ తేదీనా బాంగ్‌కాకు రేడియో తమ ప్రజలు జపానుతో పోట్లాడరాదని హెచ్చరించెను. "ప్రస్తుతం సయాం ప్రజలు విశాలహృదయులై యుండాలి. ఒకరిపై నొకరికి కోపం, పగసాధించాలను అభిలాష యుండరాదు. జపానువారు సయాంవారు యిచ్చిపుచ్చుకొనే భావంలో ఉంటే తగవులే ఉండవు."

ఈ విన్నపంలో అంతరార్థం తెలుసుకొనుట కష్టంకాదు. జపానువారు చాల తీసుకొని సయాంవారికి చాల తక్కువ యిస్తున్నారని రూఢియగుచున్నది. అందుకే సయాం ప్రజలు తిరగబడుతున్నారన్నమాట.

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.